శ్రీ కృష్ణ.

1౯

# జీవేశ్వరులు.



చెన్నపురి
ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనివారిచే
ఆనంద ముద్రణాలయమున
ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.



1921.

శ్రీకృష్ణ.

# జీవేశ్వరులు.

---

మన దేశమునం దనేక మతములుగలవు. అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము, జైనమతము, నాస్తికమతము, ఆర్యమతము, సాంఖ్యమతము, పూర్వమీమాంసకమతము. బ్రాహ్మమతము, సౌరమతము, శాక్తమతము, శైవమతము, వల్లభమతము, వైష్ణవమతము, హిరణ్యగర్భమతము, విరాణ్మతము, సౌగతమతము, యోగిమతము, మన్మథమతము, గాణపత్యమతము, కాపాలికమతము, మొదలగునవికలవు. ఇందు ద్వైతాద్వైత విశిష్టాద్వైతమతములు ముఖ్యములు. వీనిలో జీవేశ్వరులకు భేదాభేదవిచారణ విపులముగ చేయబడియున్నది. అయినను ద్వైతమతము, జీవబ్రహ్మలకత్యంతభేదము గలదనియు. బ్రహ్మము ప్రపంచమునకు నిమిత్తకారణముగాని యుపాదానకారణము గాదనియు, చిదచిత్తులు బ్రహ్మముతోపాటు నిత్యములనియు, నవియె జగదుపాదానకారణములనియు, నివి బ్రహ్మమునందు అపృథక్సిద్ధవిశేషణములు గాక బ్రహ్మమునకంటె వేరుగానుండునవి యనియు జెప్పుచున్నది. అట్లగుటవలన ననగా చిదచిత్తులు బ్రహ్మముకంటే వేరుగా నిత్యములయి యుండుటవలన బ్రహ్మమునకు సర్వవ్యాపకత్వమునకు భంగము నందువలన సర్వశక్తిలోపమును చిదచిత్తులే యుపాదానకారణ మగునప్పుడు బ్రహ్మమునందు జగత్కారణత్వము సిద్ధింపకుండుటయు నచిత్తు యుపాదానకారణమనుట

వలన కారణమునకు హద్దులేకుండుటయు సంభవించును. మరియు జగత్సృష్టికర్త యెట్టివాడుగ నుండవలయునన్న ననిత్య ప్రపంచము నెల్లప్పుడు సృజించుటకు నిత్యత్వమును ననేకోపయోగార్థముగ యోచించి పదార్థముల సృజించుటలో సర్వజ్ఞతయు నట్టి పదార్థములను బనిముట్లు లేకయే చేయుటకు సర్వశక్తిత్వమును సర్వప్రాణులకు నదృష్టానుసారముగ, ఫలమునిచ్చుచు తత్తజ్జీవకర్మములను సాక్షిగా నెఱుంగుటకు సర్వజ్ఞత్వ సర్వవ్యాపకత్వంబులును, సర్వమును దననిర్ణయప్రకారము నడిపించుటకు సర్వేశ్వరత్వంబును నిమొదలగు సర్వశక్తులుగలవాడుగ నుండవలయును. చిదచిత్తులలో చిత్తనగా జీవుడు కించిజ్ఞుడయినందునను, అచిత్తు జడమయినందునను, చిదచిత్తులే జగత్తున కుపాదానకారణమనుట యసంగతము. ఇయ్యాది ప్రత్యక్షయుక్తికి విరుద్ధంబుగావున బ్రహ్మంబు సర్వశక్తిస్వరూపంబు నేకంబుననియు పరాపరములనియెడి తనశక్తుల కలయికచే ప్రపంచంబును నిర్మించుననని యనుటలో నాక్షేపమేమియు గానరాదు.

అద్వైతమతములో నేయుపయోగంబును లేని ఆకాశమువంటి శూన్యప్రాయమైన నిర్గుణము, నిర్విశేషము, జ్ఞానస్వరూపము. అగుబ్రహ్మమున్న దనుచు జీవుడే యాబ్రహ్మంబనుచు బ్రహ్మసత్యం జగన్మిథ్యయనియు చెప్పబడియున్నది. ఇదిచూడగానే యుక్తియులేనిదిగా నున్నది. ఎట్లనగా జగత్తు మిథ్యయనగా అనిర్వ[illegible] రజ్జు సర్పభ్రమ వంటి భ్రాంతిచే కల్పితమని చెప్పుచున్నారు. ఆపక్షములో బ్రహ్మమునకే కదా భ్రమకలిగి జీవత్వముకలిగెను. తనకంటె వేరు

వస్తువు లేక సత్యము, జ్ఞానము, ఆనందము స్వరూపముగాగల బ్రహ్మమునకు భ్రమయెట్లు కలుగును. ఈపక్షమందు రజ్జువును భ్రమించువాడును పూర్వము చూడబడుసర్పంబును భ్రమకాధారమైనసాదృశ్యము మొదలయిన దోషములు ఉంటేనే గాని భ్రమకలుగదుగదా – కావున నిర్గుణంబును నేకంబును జ్ఞానస్వరూపంబునగు బ్రహ్మంబునకు భ్రాంతికలుగుననుట సందర్భముకాదు.

మరియునిర్విశేషచిన్మాత్రంబగు బ్రహ్మం బొక్కటియే పరమార్థము. దానికి వేరయిన జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయ, భేదములు అనగా తెలిసికొనేవాడు తెలిసికొనదగినది. తెలివి అను భేదములు అసత్యము. నిర్విశేషమనగా విశేషములు లేనిది. విశేషములనగా సజాతీయ విజాతీయ స్వగత భేదంబులని మూడువిధములు. అందు సజాతీయభేదమనగా ఒకజాతిదైన ఘటము మొదలగు వస్తువులలో నొక దానితో నొక దానికి గల భేదము. విజాతీయభేదమనగా నొకజాతివస్తువకు వేరొకజాతివస్తువుతో గలభేదము. స్వగత భేదమనగా వృక్షమునకు తనయాకులు పువ్వులు మొదలగు వానితోగలభేదము ఈమూడుభేదములునుబ్రహ్మమునకు లేవు ఏలననగా-చిత్తు అనంబడు జీవుడు బ్రహ్మంబునకు వేరుగాడు, అందువలన సజాతీయభేదము లేదు. అచిత్తనంబడు. అవిద్యయనునొక విజాతీయవస్తువుగలదుగాని అదిమిథ్యాభూతంబుగాన విజాతీయభేదము లేదు. సచ్చిదానందఘనస్వరూపంబగు బ్రహ్మంబునకు స్వరూపముకంటె వేరుగా గుణములు లేవు గాన స్వగతభేదంబు లేదు. గానబ్రహ్మము నిర్విశేషమని చెప్పుచున్నారు. ఇటుల చెప్పుట సరికాదు. ఏలన్న

సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేక నిర్గుణమయిన బ్రహ్మము జగత్కారణ మెట్లగును. మరియు జగత్తేమిథ్యయగు నపుడు దానికి కర్తయేల? జగత్తుమిథ్య యయ్యెనేని నానా విధములయిన పదార్థములు నాయాకార్యంబుల కుపయోగిం చకపోవలయును. మిథ్యయైన గగనారవిందంబును, గొడ్రాలి కొడుకు కార్యోపయోగులగుదురా? ఇంతియకాక నిర్గుణమైన యాబ్రహ్మము మాయయను నుపాధిచేత నీశ్వరుడై సర్వజ్ఞత్వ సర్వ శక్తిత్వాదిగుణములను గలిగియున్నాడనియు ఆబ్ర హ్మమే అవిద్య (అజ్ఞానము)యను నుపాధిచేత జీవుడై యల్ప శక్తిమంతుడగుచున్నాడనియు నట్టి యీశ్వరుడు ప్రకృతి జీవు లను మిశ్రితము జేసి సమస్త ప్రపంచమును జేయుచున్నాడ నియు, జీవుడు పుణ్యాపాపములను చేయుటవలన స్వర్గనరకము లనుభవించి అవశిష్టకర్మఫలానుభవముకొరకు నీచోచ్చజన్మ ము లెత్తుచున్నాడనియును నుడువుచున్నారు. అబద్ధములయిన మాయావిద్యలను నుపాధులచేత శుద్ధమును నిర్గుణమును నైనబ్రహ్మమునకు నీశ్వరత్వ జీవత్వము లెట్లు గలిగినవి. ఆజీ వేశ్వరులు గుణవిశిష్టు లెట్లైరి. నిర్గుణ బ్రహ్మమును గుణవిశిష్టు లయిన జీవేశ్వరులుగా జేయునంత బలము ప్రకృతికి కలిగిన పుడు బ్రహ్మముకంటె ప్రకృతియే బలముగలదిగదా. ఇట్లు కాగా ప్రకృతియను పదార్థము నబద్ధమనుట యెట్లు. అయితే యిదివాస్తవము కాదు. భ్రమవలన గలిగినదని చెప్పుచున్నారు. ఆభ్రమకలుగుటకు భ్రమాధారమయిన ముత్యపుచిప్పయు భ్రమించువాడును పూర్వము చూడబడురజతమును నిత్యా దులులేకయే భ్రమ యెట్లుగలుగును.

రెండవపదార్థము లేకపోయెను. బ్రహ్మము నిర్గుణమా యెను. భ్రమాధారమేది. భ్రమించువాడెవడు. శుద్ధనిర్గుణము యిన బ్రహ్మమునకు భ్రమగాని యుపాధిసంబంధముగాని చెప్పుట యుక్తియుక్తముగానుండదు. కనుక యద్వైతులగు విద్యారణ్యస్వాములవారు శుద్ధబ్రహ్మము స్వచ్ఛమైన యంతః కరణములో ప్రతిబింబించినందున జీవుడాయెననుట యాప్రతిబింబమే అజ్ఞానమువలన తాను అహంకార మమకారాదులచేత కర్మ ములజేయుటచే కర్మఫలరూపములయిన స్వర్గనరకాదులనుభ వించి నీచోచ్చజన్మములనెత్తి సుఖదుఃఖము లనుభవించుచున్నా డనియు, క్రమముగ మహావాక్యశ్రవణాదులవలన నహంబ్రహ్మా స్మియను బ్రహ్మాపరోక్షజ్ఞానము గలిగి అందువలన నజ్ఞాన రూపములయిన కర్తృత్వాది వృత్తులన్ని నశించగా జల ములో గలిపిన యిండుపు గాయబడక ఆజలమునందున్న మాలిన్యమునంతను బోగొట్టి అదియొక స్వరూపముగానే క్రమ ముగ బోయినట్లు అహంబ్రహ్మాస్మియను నిశ్చయవృత్తికూడ స్వయముగ నిలిచిపోవుననియు, నావృత్తివిలయమె మోక్షమ నియు వ్రాసిరి. ఇది మరియు నసంగతము. ఎట్లనగా నిర్గుణమై యేవిధమయిన రూపములేని బ్రహ్మము మిథ్య (అబద్ధమూ) యైన యంతఃకరణమునందు నెట్లుప్రతిబింబించును. ప్రతిబిం బించెబో యాప్రతిబింబము చంద్రుని ప్రతిబింబమువలెను నొకవస్తువుకాదుగదా? అదికర్తృత్వాదులు గలిగి కర్మములు చేసి సుఖదుఃఖాదులనుభవించు టెట్లు? బ్రహ్మముకాక ప్రతిబింబ రూపమయిన యావస్తువునకు 'అహంబ్రహ్మాస్మి' యనునపరోక్ష జ్ఞానముకలుగు టెట్లు? ఇట్లు ఏకాంతముగా సమాధిచేయుచు

నుండగా నిద్రాప్రారంభము వల్ల నొకయానందావిర్భావము గలుగుచున్నది. అదే స్వరూపానందమనియు, బ్రహ్మానంద మనియు, జెప్పుచున్నారు. ఇక్కడ దహించితే పోవునట్టి శరీర ములోగలుగు నానందము బ్రహ్మానందమెట్లగును? ఇదేమోక్షా నందమైతే శరీరముండగానే మోక్షముగలుగవలసివచ్చును. అయితే ఇదియే జీవన్ముక్తియని చెప్పుదురు. ఇదిముక్తి యైతే క్షుత్పిపాసామోహాది ప్రకృతిగుణములు వానికెట్లుగలు గును? కలుగుపక్షములో ముక్తికి పునరావృత్తిచెప్పవలసివ చ్చును. ఇది యెంత యసంగతమో యోచింపుడు అట్లు బ్రహ్మాద్వితీయజ్ఞానముగలిగెబో తనకుగలిగిన సుఖదుఃఖములు నశింపజేసికొనుటవలన తనకే హాని. అయితే బింబాధారమైన బ్రహ్మమునకు మోక్షసుఖముగలుగుచున్నదని చెప్పుచున్నారు. చేసినవాడొకడు ఫలమనుభవించినవాడొక డనులోకసామెతే యగును. మంచిది. ప్రతిబింబించు నిర్గుణబ్రహ్మమునకు నంతఃకరణమందు ప్రతిబింబించుటచే బంధమెట్లుకలిగె? ఎట్లు దుఃఖముకలిగె? నిర్గుణమైన యొక శూన్యవస్తువునకు మోక్షా నంద మెక్కడవచ్చును? ఇందువలన ప్రపంచమునకు నేయుప యోగమును లేని నిర్విశేష నిర్గుణచిన్మాత్రబ్రహ్మ మున్నదని చెప్పుటయు లేనిప్రాయమే యయ్యె. కాబట్టి శాంకర విద్యా రణ్యాద్వైతమతములు సరికావు.

మరియు భగవంతుడు తనయంతటదాను జీవులుగ నగు టకు గారణముగానరాదు. మరియు న్యాయమును బట్టిచూచి నయెడల దన్ను దానే యారాధించుకొనునా? జీవుడు నీశ్వరుడు నొకటియే యైనయెడల నీశ్వరారాధన యేల చేయవలెను?

చరిత్రమునుబట్టిచూచినను నీప్రపంచమునందు జీవేశ్వరభేదమే యున్నది. మనలో నద్వైతులు మాత్రము అభేదమును జెప్పుచున్నారు. ఆయభేదమును శంకరులవారేసమయమున నేయుద్దేశముతో జెప్పియుండిరో దానిని గమనించవలెను. త్రిమతాచార్యులచే బరిష్కరింపబడి యిప్పటికినిలిచియున్న మత త్రయవిషయము గొంత చెప్పవలసియున్నది. క్రొత్తగ నొక మతము పుట్టుటకు గాని యందులో మార్పులుజరుగుటకుగాని యామతబోధకుల విద్యాశక్తినిబట్టి ఏలుపడదు. ఆయాకాల ములనుబట్టి మార్పుజరుగుట కవసరముకలిగినపుడు క్రొత్తమత ములు పుట్టుచున్నవి. అట్టియవసరము తటస్థించుట కప్పటికున్న మతములో లోపముకలుగుటయే కారణమైయున్నది. అదియె ట్లనిన? హిందూమత మనేకశాఖలుగలిగి మంత్రాదులయందలి పిచ్చినమ్మకములచే క్రమముగ యుక్తప్రవర్తననశించుటవలన యుక్తప్రవర్తనమే మనుజునకు ప్రధానమని బోధించుటకు బౌద్ధమతము పుట్టినది.కొంతకాలమున కందుదోషములు వృద్ధి యగుటనుబట్టి దాని నణచుటకద్వైతమత ముపదేశింపబడినది. మరికొంతకాలమున కందుదోషములు కనబడుసరికి విశిష్టాద్వైత ద్వైతమతములు బోధింపబడినవి. కావున వానిలోని ముఖ్యాం శము లీక్రింద బొందుపరుపబడును.

ఒకమతమునకు సాధకములైన శ్రుతిస్మృతులకు తదితరమతగురువులు చేయునర్థములు ఆయామతస్థులు చెప్పునపుడుబహుచక్కగ దమతమ మతములకు నమరియున్నవి.ఇంతియు కాక, త్రిమతస్థుల దేవతారాధనక్రమము, కర్మలవిధానము, ఆచారములు,నించుమించుగ నొక్కతీరుననే జరుపబడుచున్నవి.

మతత్రయాచార్యుల యుద్దేశములను గనిపెట్టక వారి వారి శిష్యులీర్ష్యాబుద్ధికలవారై యనవసరమైనవానిలో గొన్ని మార్పులను జేసిరి.

ఈమతములనాదిగానుండగా కలియుగమున శ్రీశంకరాచార్యులవారు తిరుగనేల? నింతపట్టుదలతో నద్వైతమును జేసిరని యోచించెదము. దేశకాలముల ననుసరించియే శ్రీభగవదవతారములకు రాజకీయశాసనములకు, మతములవ్యవస్థలకు మార్పులు గలుగుచుండును. భారతయుద్ధములో ననేకులగు గొప్పరాజులు హతులైనను పాండవుల శాఖవారీదేశమును పాలించువంతవరకు లేదా పద్మనాయకుడును నందుడు నని చెప్పబడు మహారాజువరకు మనహిందూమతము పూర్వము వలెనే వేదవిహితకర్మలకు లోబడియుండిన ట్లున్నది. అటుపైని యీదేశ మొకనిచే పాలింపబడక వేరు వేరు రాష్ట్రములను వేరు వేరు రాజులు పాలింపుచుండిరి. సర్వాధికారి యొక్కడు లేకపోవుటచేతను,ఈరాజులలో బరస్పర వైరములచేతను రాజనీతులు, ఆచారములు మార్పునొందుటకు ప్రారంభమాయెను. ఆయాప్రభువుల వద్దనున్న పండితులగు వారును వారి వారి పాండిత్య ప్రసిద్ధికొఱకు వేదాదిగ్రంథములకు భిన్నార్థములు చెప్పుచువచ్చిరి.

[redacted] బుద్ధుడను బౌద్ధమతస్థాపకుడు కలియుగప్రారంభము 2602 వత్సరము లేదా క్రీస్తునకు 500 సంవత్సరములు

ముందుగా జన్మించి నిరీశ్వరవాదమును జేయుచు, ననేకులను యుక్తులు చెప్పి తన మతములో గలుపుకొనుచు, తుదకు దనతల్లి దండ్రులను గూడ గలిపికొనగా దండ్రియొకరాష్ట్రమునకు రాజు కావున నారాష్ట్రములోనివారందరును బౌద్ధులైరి. అదిమొదలు బౌద్ధమతము శ్రీశంకరాచార్యులవారు జన్మించువరకు దినదినప్రవర్ధమానమై యుండెను. బుద్ధునికాలము క్రీస్తుశకమునకు ముందు500 సంవత్సరములు శంకరాచార్యుని కాలము క్రీస్తుశకము 787 సంవత్సరములై యున్నది. ఈకాలములో ననగా 1287 సంవత్సరములలో నీబౌద్ధమతము నిండుగ బ్రబలి యీదేశమునందే గాక, బర్మా, చీనా, జపాన్, తూర్పుదేశములకును, సింహళద్వీపమునకును వ్యాపించినది. ఇప్పటికిని పై దేశములవారు బౌద్ధులైయే యున్నారు. ఛాందసముగాను, శ్రమకరముగాను నుండెడి వేదవిహితకర్మలను వదిలి నడచుట కడురుచ్యముగా బ్రజలకు దోచెను. అందుచేత నదిత్వరలో నీదేశమునందంతటను వ్యాపించినది. ఇంతట శ్రీశంకరాచార్యులను మహాపురుషు డుద్భవించి నిరీశ్వరమతము నణచుటకు సాధనమేమని దీర్ఘముగ నాలోచించి,యద్వైతసిద్ధాంతమును బ్రబలింపజేయుటకంటె వేరులేదనితలచి, యాసిద్ధాంతమునుపదేశించి స్థాపించెను. ఈశ్వరుడొకడు గలఁడనియు' నతనివలన నీయావత్తుసృష్టిజరుగుచున్నదనియు, నతని నీవిధముగ నారాధింపవలెననియు,నుండు బూర్వపు సిద్ధాంతమునకు విరుద్ధముగా నీశ్వరుడు లేనేలేడనియు, నంతయు స్వభావమువలన బుట్టుచున్నదనియు, నుండునమ్మకమును బోగొట్టి వేదవిహితకర్మల యందు బ్రజ లనురక్తులనుగా జేయుటకు నీశ్వరునికి, జీవునికి

నభేదము, నీవు నీశ్వరుడు నొక్కపదార్థమే. ఉపాధి భేదము చేత నే భేదముకలుగుచున్నదిగాని వేరుగాదనియు, నజ్ఞానము చేత నభేదమును గనిపెట్టలేకయుంటివనియు; యథావిధిగా విద్యల నభ్యసించి; వేదవిహితమైన సగుణోపాసనను జేయుచు, క్రమముగ నజ్ఞానమును బోగొట్టుకొనవలయుననియు, నద్వైతసిద్ధాంతమున కుపయోగపడు శ్రుతిస్మృతులను సమన్వయించి బోధించుటచే నట్టియీశ్వరుడను నేనేకదాయను నతిశయము సహజముగగలిగి, జనులందరు బౌద్ధమతమును విడిచి యద్వైతులై వేదవిహితకర్మలను మును దటివలె జేయనారంభించిరి. ఇట్లుబౌద్ధమతవ్యాప్తి నణచుటకు దత్కాలానుగుణముగ నద్వైతమతమును స్థాపించిరి. వారికాలమునాటికి బౌద్ధులైనవారుగాక మన మతములవారు వేరువేరుగ బంచదేవతల నారాధించుచుండిరి. అట్టివారినందరి నేకీభవింపజేయుటకు బంచదేవతారాధన నుపదేశించిరి. మరియు నిర్గుణోపాసన యద్వైతమునకు బ్రధానముగనుండ గృహస్థునికేకాక సర్వకర్మలను వదిలిన సన్యాసికిగూడ, సగుణోపాసనయే ప్రధానమనిఎంచి తమరే నాలుగుస్థలములలో నాలుగు దేవతారాధన పీఠములను స్థాపించి పంచదేవతలను బూజించుచుండిరి. ఈయాచార్యులవారు గతించిన పిదప వారి శిష్యులును శిష్యశిష్యులును వారియుద్దేశమును నప్పటియవసరమును గనిపెట్టలేక యొకనియామకుడగు నీశ్వరుడు లేడని విచ్చలవిడిగాదిరుగు బౌద్ధులకంటె జెడి తానే యీశ్వరుడని గర్వించి దేవతారాధనమాని ప్రచ్ఛన్న బౌద్ధులగుచువచ్చిరి. మిగుల నవివేకులగువారు ప్రతివస్తువయందు నభేదబుద్ధి గలవారై కాంతాకనకాదులయందుగూడ భేదము

లేకయుండిరి. ఇవ్విధమున నద్వైతులు బౌద్ధులకంటె వ్యాపారములయందు జెడుచు, శంకరాచార్యునికాలము మొదలు 229 సంవత్సరముల కాలమున నీయద్వైతమతస్థు లీతీరున ప్రబలినందున దిరుగ మనమతమునందు మార్పుగలుగవలసి వచ్చెను. ఇంతలో శ్రీరామానుజాచార్యులవారు క్రిస్తుశకము 1016 సంవత్సరమున జనించి యాస్తికమతములవారందరిచే నారాధింపబడువిధమున కనుకూలమగుచుండు విశిష్టాద్వైత మతమునుస్థాపించిరి. అప్పటి యద్వైతమతస్థులందరు నభేద బుద్ధితోడ దానేయీశ్వరుడని గర్వించి యుండగా చిద చిత్తులతోగలిసిన యీశ్వరునికంటె వేరులేదనియు నీశ్వరు నివలె నీవును నిత్యుడవనియు, నీవునుసతని యథావిధిగనారాధించినచో వైకుంఠములో నతనితో శ్రీలక్ష్మీకౌస్తుభగరుడజగ ద్వ్యాపారములు వినాగా సమానుడవై, యతనివలె నిత్యుడవై యుండుదు వనియుబోధించిరి. మరియు చిదచిత్తులులేని భగవంతుని యునికివలన ప్రయోజనమేమి? అనియుండినగదా నానా విధసృష్టిజరుగుచున్నయది. ఇట్లు విశిష్టాద్వైతమతమునుస్థాపించి బ్రాహ్మణులకేకాక స్త్రీలకు శూద్రులకు నష్టాక్షరీమహామంత్ర మును జపించుట కధికారమున్నదనియు, వారలకుగూడముక్తి గలదనియు, మరియు నారాధనక్రమములో నందరికిజేయనవ కాశముగల సులభవిధమును నిర్ణయించిరి. శంకరాచార్యులచే నారాధనకు నిర్ణయింపబడిన పంచదేవతలలోని శ్రీమన్నారాయణుడు త్రిమతస్థులచే నంగీకరింపబడిన గీతలలో నేమి తదితరగ్రంధములలో నేమి యధికుండని చెప్పబడియుండి నందున నన్యదేవతారాధన నంగీకరింపలేదు, మరియు నారాయణుడు

సర్వదేవతలలో నధికుడగుటచేత నోకదా ? శంకరాచార్యులు మొదలు ఇటీవలి యద్వైత సన్యాసులు గూడ నొకరు వందనము జేయునపుడు నారాయణ స్మరణమును జేయు చున్నారు.

ఇట్టి విశిష్టాద్వైతము శాస్త్ర సమ్మతమగుటయే కాక, దైవమేలేడను మతముకంటెను, దైవము నేనేయను మతము కంటెను యుక్తి యుక్తముగాను. ముక్తిఫలప్రాప్తికి సులభసాధనముగానున్నందున దినదినప్రవర్ధమానమై బౌద్ధాద్వైతముల నణగద్రొక్కినది. మరియు మధ్వాచార్యులవారు క్రీస్తుశకము 1117 వ సంవత్సరమున జన్మించిద్వైతమునే ప్రతిపాదించెడు ననేకశ్రుతిస్మృతులున్నందున ద్వైతమను పేరుతో నొకమత ము నద్వైతమతనివృత్తికొరకే చేసిరి.

మరియు శ్రీశంకరాచార్యులవారు అప్పటియవసర మును బురస్కరించుకొని యద్వైతమును ప్రజల కుపదేశించి యుండినను వారిప్రవర్తనయద్వైతము ననుసరించియున్నదా యని విచారింతము.

నిర్గుణోపాసన యద్వైతమునకు బ్రధానమైయుండ గృహస్థునకేకాక సర్వకర్మలను వదలినసన్యాసికి గూడ సగుణో పాసనయే ప్రధానమని యెంచి నాలుగుస్థలములలో నాలుగు దేవతారాధన పీఠములను స్థాపించి పంచదేవతలను బూజింపు చుండిరి. ఒక్కచోటనైనచో నందరికిని దెలియదనియే నాలుగు స్థలములలో నట్టిపీఠములనుస్థాపించిరి. వారద్వైతమునే నమ్మిన మొదల సన్న్యాసులకుగూడ సగుణోపాసనజేయుమని యేల నియమించిరో కొంచెము విచారింపుడు. ఒకచోట భిక్షుకుపోగా

నాయింటియాపె మాకేమియులేదు సర్వదరిద్రులము అని దీన తతో జెప్పగా, నాపెయం దనుగ్రహించి లక్ష్మీదేవిని బ్రార్థించి యామెకు నైశ్వర్యముకలుగజేసెను.

కాశీలో చండాలరూపముతో వచ్చిన యీశ్వరునికి శంకరాచార్యులవారికిని జరిగిన వాదముపైని శంకరులతని దెలిసికొనుటకు దగినజ్ఞానమింకనుదనకు లేదని స్తోత్రము జేసియున్నారు కాపాలికునికి మోసపోయి తనశిరస్సునిచ్చుటకు వరమిచ్చి లక్ష్మీనృసింహోపాసకుడగు శిష్యుడాస్వామిని ప్రార్థింపగా నాస్వామి యాపద్మపాదుడను శిష్యుని యందే యావేశించి పైకాపాలికుని సంహరించి రౌద్రాకారముతో వెలుగుచుండ నప్పుడు శంకరులాస్వామికోపోపశమనము కొరకు శివునికి గోపముండదగునుగాని నీకిదిలక్షణముగాదని యనేకవిధముల స్తోత్రముచేసి ప్రసన్నునిం జేసెను.

మరియు బరకాయప్రవేశవిద్యచే నొకరాజశరీరమున జొచ్చియుండునపుడు తనశరీరముదహింపబడుతెరిని రాజశరీరము విడిచి తనశరీరములోజొచ్చి శ్రీలక్ష్మీనరసింహాయని తనచేయిబట్టి యాచితిలోనుండి లేవదీయుమని యేల ప్రార్థించిరో చూడుడు.

ఈశంకరాచార్యులీశ్వరుని యవతారమని యద్వైతులుచెప్పెదరు. అప్పటికీశ్వరుడొకడు వేరుగనున్నాడుగదా? మరియు నీయాచార్యులు పెక్కుతీర్థములకు బోయి యాయా స్థలదైవముల నారాధించియున్నారు. అచ్యుత, గోవిందమొదలగు నష్టకములను స్వయముగరచించినారు. కావున నీశంకరాచార్యులవా రప్పటికాలమానమునుబట్టి యద్వైతమును బ్రకటించినను నాత డద్వైతికాడని స్పష్టపడగలదు.

మరియు గీతలనుబట్టి విచారించెదము అందుప్రారంభమున

శ్లో. నత్వేవాహం జాతునాసం నత్వంనే మేజనాధిపాః,
నచైవ నభవిష్యామ స్సర్వేవ యమతః పరం.

నేను నీవు ఈరాజులు పూర్వమున్నవారమేకాని యిప్పుడు క్రొత్తగబుట్టినవారము కాము.ముందును కూడ నుండు వారమె అని శ్రీస్వామివారు సెలవిచ్చియున్నారు. కాని నేను నీవు నితరరాజులు నొక్క స్వరూపమె. అని సెలవిచ్చియుండ లేదు. అచ్చటచ్చట కొన్ని వాక్యములలో జీవేశ్వరాభేదము చెప్పబడినట్లు కానవచ్చినను భాష్యగ్రంధములలో నావాక్యములు జీవేశ్వరాభేదపరములు కావని బాగుగ సమర్థించబడి యున్నది. ఇంతియ కాక.

శ్లో. సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణంవ్రజ,
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

సర్వధర్మములను మాని నన్ను మాత్రమె నీవు శరణు జొచ్చిన యెడల నిన్ను సమస్తపాపములనుండి విముక్తుని జేసెదను అనియున్నది. ఇందువలన జీవుడొకడైనట్లును నీశ్వరుడగు శ్రీస్వామివారు వేరొకరైనట్లును స్పష్టపడుచున్నది ఎవరైనను నొకవిషయమును బోధించునపుడు దానిఫలితాంశమును నంతమునజెప్పుట నిర్ణీతమయియున్నది. పయివిమర్శమువలన జీవేశ్వరులకు భేదము సువ్యక్తమగుచున్నందున నీవిషయమున నింతకన్న నధికముగవ్రాయనవసరము లేదని చదువరులకు బోధపడగలదు

విశిష్టాద్వైతమతస్థులు అష్టాక్షరీ మంత్రమును జపించిన పిదప నీక్రిందవ్రాయబడిన ద్వయమంత్రమును చరమశ్లోక

ముసు బఠించుటకలదు. పయిచరమశ్లోక హితోపదేశమువలన శ్రీమన్నారాయణునె పరాత్పరునిగానమ్మికొలుచుచు నాస్వామినే శరణమొంది యితరదేవతారాధనను సుతరాము మాని ఐహిక సౌఖ్యములంగోరి వ్రతాదులంజేయక శ్రీమన్నారాయణు నారాధించు చున్నారు.

శ్రీమన్నారాయణచరణౌశరణంప్రపద్యే
శ్రీమతేనారాయణాయనమః.

ఈద్వయమంత్రమనునది భగవంతునికి శరణాగతినిదెలుపు ప్రార్థనగాను చరమశ్లోకము భగవంతునియాజ్ఞగాను నమ్ము చున్నారు.

నాచే రచింపబడిన హిందూమతము అనుగ్రంథములో శివకేశవులే యారాధ్యులనియు, వారిరువురు నొక్కటియే యనియు పరిష్కరింపబడియున్నది. కావున శివకేశవుల నారాధించువారు వారిరువురు సములని నమ్మి కొలిచి తరింపగోరు చున్నాడను.

శ్రీ కృష్ణదాసుడు,

బొబ్బిలి.

